శ్రీ

# వేదము చరిత్రయా?

ఇది

బళ్ళారిలో వకీలుగానుండి

కీ. శే. బ్రహ్మశ్రీ॥ కోలాచలం శ్రీనివాసరావుగారిచే

రచియింపఁబడినది.

వారిజేష్ఠపుత్రులగు కె. శత్రుఘ్నరావుచే

ప్రకటింపఁబడియె.

మొదటికూర్పు.

బళ్ళారి.

ఆంధ్రముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1928



వెల అ. 0—8—0

# వేదము చరిత్రయా?

## Is Rigvada a history?

### వేదభాష.

వేదము మతగ్రంథ మనుటకంటెను చరిత్రయనుట సమంజసమని నే నింతకుమున్ను వ్రాసినాను. చరిత్రాంశములు హెచ్చుగ నందుండుటచేతను నప్పుడు వ్రాయంబడిన యితరచరిత్రలు కానరాక పోవుటచేతను హిందువులకు ఋగ్వేదమే ముఖ్యచరిత్రగ నున్నది. హిందువులలోఁ జరిత్రలులేవనియు చరిత్రలు వ్రాయునంతటి శక్తి వారికి నుండలేదనియు పాశ్చాత్యు లభిప్రాయపడినారు. అంతయేల బౌద్ధయుగమువరకును నార్యులకు వ్రాఁతయేయుండలేదని పాశ్చాత్యు లనేకులు పలుకుటయగాక తమగ్రంథములందు వ్రాసినారు, కావున వారియభిప్రాయము తప్పని చూపుటకునై వేదభాషను గుఱించియు వారికి వ్రాఁతయుండినదియా లేదాయను విషయమును గుఱించియు యించుక వ్రాయఁబూనెద. ఇపుడు మనకునుండు సంస్కృతభాషకు సమమైనదియే దేవనాగరిభాష. ఆ రెంటికినిఁగల తారతమ్యము బహుస్వల్పము. ఆ స్వల్పభేదము సైతము వేదయుగమునకుఁ బిదపఁబుట్టిన వ్యాకరణముల ననుసరించి కలిగినది. వేదఋక్కులన్నియు సనాతన దేవభాషలోనున్నవి. దేవభాషకును నిప్పటికి సంస్కృతభాషకును గల భేదము తెలియుటకునై యిచట నొక యుదాహరణ మిచ్చెదను.

1. 2. 1. వేదము. వాయవా యాయాహి దర్శతా, యిమి, సోమా
అరంకృతా, తేషాంపాహి శృధీ హావం.

దానికి సంస్కృత రూపము } వాయవా యాయాహి దర్శనీయా, యిమి, సోమా,
అలంకృతా, తేషాం, పిబా, శృణూ హావం.

పై ఋక్కులోని నాలుగు శబ్దములయొక్క రూపములు సంస్కృతంబున మారినవి.

పైరీతిగ శబ్దములలో నించుక భేదమగపడును. ఇట్టిభేదములు సనాతన భాషలలోనుండుట సహజమేను. "ఛాసరు" కవిగ్రంథమును జదివినవారికి, నా భాషకును నిప్పటి యింగ్లీషు భాషకును నెంతవ్యత్యాసముండునది తెలియును. సంస్కృతము వ్యవహారభాషగ నెప్పుడు నుండలేదని కొందఱు పాశ్చాత్యు లభిప్రాయపడినారు. సంస్కృతభాష మేలైనది కాదనియు నా భాషలో నొకవస్తువునకు నొకమాటయగాక యనేకశబ్దములున్నవనియు కొందఱి యభిప్రాయము. ఇట్లు

భాషకుఁ జేరిడిన పాశ్చాత్యపండితుల యభిప్రాయము ఖండింప నితర పాశ్చాత్య పండితుల యభిప్రాయ మిచటవ్రాసెదను.

సంస్కృతప్రశస్తి.

" సంస్కృతభాష యత్యాశ్చర్యకరమైనదనియు గ్రీకుభాషకంటెను బుష్టికరమైనదనియు లాటిన్‌భాషకంటెను శబ్దబాహుళ్యము గలదనియు Sir W. Jones గారభిప్రాయ మిచ్చినారు. సంస్కృతమున నొకసమస్తపదము 152 పదముల కూడికకలదిగ నున్నదని వారే వ్రాసినారు. అంతకంటెను హెచ్చుగ ప్రొఫెసర్ బాపుగారు తాత్పర్యమిచ్చుచు నతిసౌందర్యమైనట్టియు నతిధారాళముగఁ బ్రవహించునట్టియు భాషసంస్కృతమని పలికినారు. భాషలలో భాష సంస్కృతభాష యని మాక్సుముల్లరుగారి తాత్పర్యము. సంస్కృతభాష నన్నిటనిండి, పుష్టిగనున్నది కావున దీనికి సంస్కృతమనుశబ్దము సార్థకపడినదని జర్మన్‌పండితుఁడు ష్లిగల్ వ్రాసినాఁడు. ఇటులుండఁగ జేమ్సుమిల్లుగారు తమకు హిందువులపైఁగల దురభిప్రాయమనుసరించి పలుకుచు "భాషగొప్పదనుటకు సాదృశ్యమొక వస్తువునకు నొక పేరు మాత్ర ముండవలెనుగాని యంతకంటెను హెచ్చుగనుండరా' దని వ్రాసినారు. వారి తాత్పర్యమే నిజమైనచో పద్యకావ్యముల గతి యేమి? వాక్పటుత్వ మెచటనుండును? భాషాభివృద్ధి యెటులగును? బుద్ధి యెటుకుశలతఁగనును? సౌందర్యాలంకారములును శక్తియు పుష్టియులేకయున్న భాషగతి యేమియగునోయని పాశ్చాత్యులనేకులు ప్రశ్నించినారు. సంస్కృతము లాటిన్‌కంటె నధికగౌరవముగల భాషయనియు నాభాషలో సూర్యునకు ముప్పదియుఁ జంద్రునకు నిరువదియు గృహమునకు నిరువదియుఁ బ్రాహ్మణునకు నాలుగుఁ బర్ణమునకు నైదునుఁ గోతికిఁ బదియు గోవునకుఁ దొమ్మిదియు శబ్దములున్నవని "లిపెటీపోలైకో" గారు మెచ్చినారు. దేవనాగరీ భాషాక్షరములనుండి పాశ్చాత్య భాషాక్షరము లేర్పడెనని బోన్సుగారి తాత్పర్యము. గ్రీకుభాష సంస్కృతమునుండి పుట్టినదని పోకాక్కుగారి యభిప్రాయము. " సంస్కృతమునకును గ్రీకుభాషకును నైరాన్లభాషకును సంబంధము విశేషముగ నున్నదనియు శబ్దవాక్య పల్లవములు నొక్కతీరుగనే యున్నవనియు డాక్టర్ ప్రిచర్డుగా రభిప్రాయపడినారు. సంస్కృతములో నొకటినుండి పదివరకు గల సంఖ్యల నామములే యనేకభాషలలోఁ జేరినవనియు ప్రపంచములో నొకానొక కాలమున సంస్కృతమే వ్యవహారభాషగ మాటలాడుచుండిరనియు బాపుగారు వ్రాసినారు. సంస్కృతలిపి యతి పురాతనకాలమునకుఁ జేరినదని వెబ్బరుగా రభిప్రాయపడినారు, " హిందువులకు భాష యెంతకాలమునుండి యున్నదియో

యంతకాలమునుండియు వారికి వ్రాతయుండెనని డాక్టర్ విల్సన్‌గారు లిఖించినారు. అక్షరముల సాహాయ్యమువలన వ్రాయువ్రాత యిండియాలోఁ బురాతన కాలమునుండి యున్నదనియును శాసనములకేగాక దిన వ్యవహార చర్యలందును సైతము వ్రాత విశేషముగ నుపయోగించుచుండిరని హీరన్‌గారభిప్రాయపడిరి. గోల్డుస్టక్కరు, రాత్తు, విట్నె, మొదలగువారు "ప్రాతిశాఖ్య రచించిన ఋషులు తమయెదుట గ్రంథములులేక దానిని వ్రాసియుండరని నిర్ధరించినారు.

లిపియుండెనా?

క్రీస్తుశకమునకు 350 సంవత్సరములకు మున్ను హిందువులకు వ్రాత పుస్తకము తెప్పియును లేవని మాక్సుముల్లరుగారు వ్రాసిన వ్రాత పిచ్చివ్రాత యని పలువురు పండితు లభిప్రాయము. బేలీగారి గణిత మనుసరించి చూచినచోఁ గ్రీస్తుశకమునకు 3000 యేండ్లకుమున్ను హిందువులు క్షేత్రగణితములోను జ్యోతిశ్శాస్త్రమందును ప్రావీణ్యముఁగాంచి యుండినటు లేర్పడును. అక్షరములును సంఖ్యలునులేక వారంతటి ప్రావీణ్యమార్జింపఁగలరా? మాక్సుముల్లరుగారి యభిప్రాయమే నిజమైనచో జనులు బ్రాహ్మణములను జ్ఞప్తిలోనుంచుకొని యుండిరనెడి యర్థమగును. బ్రాహ్మణములుండు రీతినిఁబట్టి యంతటిగ్రంథములు జ్ఞప్తిలో నుంచుకొనుట సాధ్యమే కాదని ప్రొఫెసర్ మాక్సడనకర్ అభిప్రాయపడినాఁడు. ఆక్సఫర్డు బాలియల్ కాలేజి సంస్కృతోపన్యాసకుఁడగు శ్యామజి కృష్ణవర్మ "వేదముల కాలమునుండి యార్యులకు లిపియుండెననియు వేదములలోనేమి బ్రాహ్మణములలోనేమి సూత్రములలోనేమి "వ్రాతకు" సమానార్థము నిచ్చు శబ్దములున్నవనియు పాణినికి బహుదినములకుమున్ను గద్య పద్య మంత్రగ్రంథము లుండెననియు కానిచో పాణిని యంతటి వ్యాకరణము వ్రాయుట సాధ్యము కాదనియు వ్రాతలేనిది గొప్పవచనగ్రంథములు కంఠతః నేర్చికొనుట యసాధ్యమనియు నభిప్రాయ మిచ్చినారు. శ్రుతియను శబ్దార్థమునుబట్టి వ్రాత యుండలేదనిన స్మృతిగతి సైత మట్టిదియ యగును. స్మృతులు వ్రాయఁబడినట్టివియని సకలురయభిప్రాయము.

ఋగ్వేదములో నొకభాగమున "వాక్యములుఁ జూచియుఁ జూడక, వినియును వినక" యని యున్నది. వాక్యములుఁజూచి యనుటలో వ్రాతయుండెననెడి యర్థ మిమిడియున్నది. మఱియొకవిషయముఁ సంఖ్యలులేనిది కోటివరకును లెక్కపెట్టుట సాధ్యముకాదు. వ్రాతతెలియని కాలమున గ్రీకువారు దశసహస్రమునకంటె హెచ్చుసంఖ్యకుఁ బేర్లెఱుంగక యుండిరనియు రోమ్‌వారు సహస్రమునకంటె హెచ్చుసంఖ్య తెలియకయుండిరనియు చరిత్రకారులు వ్రాసినారు. గ్రీష్ము

దేశస్థు లార్యులభాష మెచ్చుకొనుచుండిరనియు చెట్ల తొక్క (పట్ట) పైన నార్యులు వ్రాయుచుండిరని "కర్టియస్సున్ను" దూదినిఁగొట్టి దానిపై నక్షరములు వ్రాయుచుండిరని "సియార్కస్సున్ను" తెలిపినారు. అస్సిరియాలో నిపుడు దొరుకు నిటికెపెల్లలపైనఁగల వ్రాఁతఁ జూచినచో నిప్పటికి 5000 వేల యేండ్లక్రిందట నా దేశములో వ్రాఁతయుండెనని స్పష్టమగుచున్నది. ఆస్సిరియా వారు తమ నాగరికత నార్యులనుండి నేర్చిరని నేనింతకుమున్ను వ్రాసినాను కావున నార్యులకు నిప్పటికి నైదువేల యేండ్లకుమునుపే వ్రాఁతయుండెననునది స్పష్టము.

చరిత్రలుండెనా?

ఋగ్వేదాదులయందు చరిత్రాంశములు చాలుగనుండినను నది మతగ్రంథమని తలంచినకారణంబునను నందుండు స్వరోచ్చారణ క్రమమును నోట నేర్వకున్న జ్ఞప్తిలోనుంట యసాధ్యమయియుండిన కారణంబుననునార్యులు దానిని గురుమూలకముగఁ గంఠతః నేర్చుచుండిరి. కావుననే యార్యుల మిగతచరిత్రగ్రంథము లనేకములు పోయినను వేదములు నిలిచినవి. మనలోఁ గాలమునుదెలుపు పూర్వచరిత్రలు లేవనుట నే నమ్మను. ఉండి, పోయిన వననగును. ఉండినవికొన్ని పరస్పర విరోధములతో నిప్పటి హిందువులబలెఁ బెనఁగులాడుచున్నవి. పరమతస్థులు మన పురాతన పుస్తక భాండాగారములను పరశురామ ప్రీతిఁ గావించిరనునది చరిత్ర లభ్యసించినవారికెల్ల విదితము. హైందవపుస్తకములపై "ఔరంగజేబు"నకెంతటి యసహ్యముండినదియో సకలురెఱుంగుదురు. ఆఫ్గన్ తార్తారు ఆరెబ్బు జాతులవారు గ్రీసు పర్షియా యీజిప్టు యిండియా దేశములందుండిన పుస్తక భాండాగారములను గాల్చుటయగాక శిల్పులు తమప్రావీణ్య ప్రదర్శనమునకునై కట్టిన కట్టడములును, జెక్కిన అతివిగ్రహములును లయమొనర్చి నిందునైరి. అలెగ్జాండ్రియన్ గ్రంథాలయము నాశనమొనర్చినవారి దౌష్ట్యమెంత దూషించినను తీరదు. దానినుండి ప్రపంచమునకెంత నష్టమయ్యెనో పలుక నలవికాదు. బుద్ధ గయలోఁ దొమ్మిదిమేడలు నిండిన గ్రంథములును ధర్మగంజిలోనునంతటి పుస్తక భాండాగారమును, మఱియు నోదంతిపురమున నుండిన గొప్ప గ్రంథసంచయమును, కిల్జిసేనాధిపతి మహమ్మదు బెన్‌సాం అనువాఁడు నాశనమొనర్చెనని చరిత్రలు దెలుపుచున్నవి. అన్‌వారాలోనుండిన గొప్ప సంస్కృత గ్రంథాలయమును "అల్లాయుద్దీన్" కిల్జీ కాల్చెననియు కోహార్‌లో నుండిన గ్రంథాలయము ఫిరోజిషాటోగ్లాకు లయ మొనర్చెననియు తురుష్క పండితులే వ్రాసినారు. ఈరీతి గ్రంథనాశనమొనర్చు చెడుబుద్ధి పరమతస్థులగు పామరులకు నొక్కటియగాదు, పూర్వకాలంబునఁ బండితులకుసైతఁ ముండినది.

గ్రెగరీ గొప్పపండితుఁడగు మతస్వామిగ నుండినను లాక్క్యూటె వేద్యనేర్చి వ్రాసిన గ్రంథములెల్లను గాల్పించి భస్మముచేసెను. కుమారిలభట్టు బౌద్ధుల గ్రంథముల నడుగంటఁజేసెను. జైనుల ననేకుల వాదమున నోడించి వారిగ్రంథములు వారిలో మునింగి పోఁజేసిరి. ఈ దేశము గొప్పది కావున మూలంబడిన కొన్ని పూర్వగ్రంథములు హతశేషములుగ నిలిచినవి. హిందువులలోఁ జరిత్రలు వ్రాయువాడుకలేదని పలుకునది సాహసమో లేక యజ్ఞానమో, విశేషప్రయత్నము లొనర్చి యన్వేషించినచో రాజతరంగిణినిఁబోలు మఱికొన్ని చరిత్రములు దొరకవచ్చునని ప్రొఫెసరు హీరన్‌గారు వ్రాసినారు. అస్సిరియా రాజగు "Ashur Bani Pal" యను వాఁడు దేశదేశములకును బండితులనుబంపి యిటికెపెల్లలపైన వ్రాయించి తన గొప్పపుస్తక భాండాగారంబున గోడలలో భద్రపఱచియుంచిన గ్రంథములెల్ల నిపుడు భూమిఁద్రవ్వఁగా దొరకుచున్నవి. ఈపుస్తక భాండాగారముఁగల భవనముయొక్క పటము "History of Nations" Part 7 లో హచ్చిన్సన్‌గారు ప్రకటించినారు చూడనగును. వంశావళినివ్రాసి రక్షించు "జాగా" యను జాతివారు రాజపుటానులో నిప్పటికినున్నవారని విల్సన్ వ్రాసినాఁడు. పూర్వకాలమునుండియు వ్రాయుచుండిన యిట్టి చరిత్రాంశము లచట నచట నుండిన కారణంబుననే టాడ్డు దొరగారు "Annals of Rajastan," యంతటి చరిత్రము వ్రాయుటకు సాధ్యమాయెను. ఋగ్వేదము ప్రాచీనార్యుల చరిత్రములుగలది. ఇటీవలనుండిన యార్యుల చరిత్రములు పురాణములు దెలుపుచున్నవి. వీనినెల్లను సమపఱచి ప్రారంభము నుండియును నొక గొప్పచరిత్ర వ్రాయుటకు హిందువులకు నోపికలేకయున్నది. దీనికిఁ గారణము లనేకములున్నవి. వేదమెట్టు చరిత్రమయినదియు నాకు సాధ్యమైనంతవరకు వెదకి యీక్రింద వ్రాయఁబూనినాను. (1) ప్రాచీనార్యు లెచట నెచట నుండిరి? (2) ఎట్లు జీవించుచుండిరి? (3) వారికి నుపయుక్తమైన సాధనము లెవ్వి? (4) వారికిఁ బశుసంపద యుండెనా? (5) జలవసతు లుండెనా? (6) వారు శాత్రవుల బాధకుఁ జిక్కియుండిరా? (7) వారు స్వాతంత్ర్యవృత్తినుండిరా లేక రాజులయేలికకు లోఁబడియుండిరా? (8) వారి ముఖ్యాహార మెద్ది? (9) వారు మాంసభక్షకులా? (10) త్రాగుడుపోతులా? (11) క్రూరులా శాంతస్వభావులా? (12) వారి స్త్రీ లెట్టివారు? (13) వారి వివాహాది కర్మము లెటులుండెను? (14) వారికి శిక్షాస్మృతి యుండెనా? (15) వారికి రాజులుండిరా? (16) యుద్ధము లుండెనా? (17) దాయభాగ శాస్త్రములుండెనా? (18) వారిస్త్రీలకు నాభరణాదు లుండెనా? (19) వారి విద్యాభివృద్ధి యెట్టిది? (20) వారికి జాతులకట్టుబాటుండెనా?

(21) వారు ద్యూతాది దుష్టకర్మ లోలురా? (22) వారియందు వ్యభిచారదోష ముండినదియా? (23) ఇప్పటివారికిఁ దెలిసినన్ని శాస్త్రవిచారములు వారికిఁ దెలిసియుండెనా? (24) వారేమి మోటువారా నాగరికులా? (25) వారికి సముద్రయాన ముండెనా? ఇత్యాద్యనేక విషయములనుగుఱించి వ్రాయుటయ చరిత్ర. పై విషయములు క్రమముగ నొక్కొక్కటినిగుఱించి వివరముగ వ్రాయవలెనన్న నొక్కొక విషయమే యొక యుపన్యాసంబగును కావున పైఁ గ్రమము నంతగఁ బాటింపక, విషయములు వదలక తగినంతవరకు నిచట వ్రాసి మిగతభాగము వేఱొక యుపన్యాసంబులోఁ జేర్చెదను.

ప్రాచీనార్యుల జననస్థానమును గుఱించియు వారుండిన దేశములను గుఱించియు వారి నాగరికతను గుఱించియు నే నిదివరలో "The world is peopled by Aryans and influenced by Aryan Civilization" యను నుపన్యాసంబున వ్రాసినాను. మిగతవిషయము లిచట వ్రాయఁబూనెదను.

ఆర్యులముఖ్యవృత్తి.

ఆర్యయనుశబ్దములో నే ప్రాచీనార్యుల జీవనమెట్లు జరుగుచుండెనను విషయముఁ దెలియవచ్చును. "అర్" ధాతువుదున్నుట యనెడినర్థమిచ్చును. కావున ప్రాచీనార్యులు కేవలకృషికర్మవలన జీవించువారని తెలియవచ్చుచున్నది. కృషికర్మవారి జీవనోపాయముగ నేర్పడెను కావున వారికిఁ బశుపక్షణ మవశ్యక మయ్యెను: స్థిరముగ నొక్కచోటనివసించి పశువులనుగట్టుకొని భూమినిదున్ని బ్రదుకువారని "యార్య" శబ్దమునుండి మనముగ్రహింపనగును. ఆర్యులకు నా జన్మశత్రువులుగ ట్యురేనియనులుండిరి. వీరెక్కాలమునను యార్యులతోఁ గలహించి వేప్పుడి వారిపై ద్వేషముఁబెంచుచు వారికి నిఱుగుపొఱుగువారయియుండిరి. ట్యురన్‌శబ్దము గొఱ్ఱెలనురక్షించువారని యర్థమగును. వీరుస్థిరముగ నొక్కచోటనివసింపక యిండ్లువాకిండ్లులేక దేశద్రిమ్మరులుగ నుండిరి. అడవులు పర్వతములు సంచరించుటకు వారికి గొఱ్ఱెలుపయుక్తములయినరీతిగఁ బశువులుపయుక్తములు కావయ్యెను. ప్రాచీనార్యులలో నైరానులు చేరినవారు. అనేక సహస్రవత్సరంబు లార్యులు తమ జననస్థానమునందుండి పిదపఁ గాశ్మీరముఁజేరిరి. జననస్థాన మార్యులువదలినందులకుఁ గారణములేచరిత్రకారుఁడును దృష్టికరముగ నుడువఁడు. ట్యురేనియనులబాధయే ముఖ్యకారణమయి యుండనగునని నే నూహించెద. భూరిక్షామమని కొందఱనియెదరు. జనబాహుళ్యమని కొందఱాడెదరు. కారణము లెవ్వియయునను గానిండు, కాశ్మీరములో నార్యులు బహుకాల ముండి

రనునది నిస్సంచేహము. ఈశాస్త్రీన మొకానొక కాలంబున నీటిలో మునింగియుండిన కారణంబున నా ప్రదేశమంతయును బురద నేలగనుండెను. కశ్యపఋషి బోధితులై యార్యులు బురదనేలను సమపఱచిరి కావున నాదేశము కాశ్యపియని పిలువంబడుచున్నది.

## భూగోళము. Geography.

ఋగ్వేదములోని కొన్ని ఋక్కుల యర్థముఁ దెలియుటకు వేదభూగోళ మెఱుంగుట యవశ్యకము. అటులనే యక్కాలమునందుండిన యనార్యు లెవరయిన దియు తెలియకయున్న నిపుడు మనవారర్థము చేసికొనురీతిగ వారు భూతప్రేత పిశాచ రాక్షసాదులని తెలియుటకుఁ గారణంబగును. సృష్టికి సంబంధించినజనులకు నారీతి నీచముగ సృష్టిలోలేని పేళ్లైటు లార్యులుపెట్టిరను విషయముసైతము తెలియుట యవశ్యకము. ఋగ్వేద రచనాంత్యకాలమునకు నార్యులు పూర్వదిశను గంగాయమునా సంగమస్థలముపరకు వ్యాపించియుండిరి. పశ్చిమమున "అస్సిరియా కాల్డియా" వరకు వ్యాపించిరి. ఇది "అక్కేడియన్" ల స్థానము. "సిథియన్సు బాక్ట్రియన్సు" యుండినస్థళ ముత్తరమేరగ నుండినది. అనఁగా నిప్పటి టర్కీస్థానమని పిలువంబడుస్థళము. ద్రావిడులు వసించుభూమి దక్షిణముగనుండినది. పైవివరించిన మేరలోనుండిన వారార్యులును నైరానులు. ప్రాగ్దిశను గంగాతీరమువరకు వ్యాపించినవా రార్యులు. పశ్చిమమున "కాల్డియా" వరకు వ్యాపించినవారైరానులు. ఆఫ్గన్‌స్థాన్ బెలూచిస్థాన్‌ను లందుండినవా రక్కాలంబునఁ జెడినయార్యులేను. గ్రీకులువారినే "ఆరియానా" లని పిలుచుచుండిరి. పశ్చిమమున నుండినగాంధారు లార్యులుగనుండి చెడినవారు, కావున గాంధారుల నార్యులు గుఱ్ఱములను బెంచు వారని నింద్యముగఁబలుకుచుండిరి. ఆర్యులకును గాంధారులకు నపుడపుడు యుద్ధములు జరుగుచుండెను.

## పంచజనులవివరము.

ఋగ్వేదమునం దచటనుండు ఋక్కులలో "పంచకృష్ట్యా, పంచక్షిత్యా, పంచకార్షణ్యా, పంచజనా, పంచభూమా, పంచజాతా" యను శబ్దములు వచ్చుచున్నవి. ఈ విభజనలనునవి యప్పటికాలమున బలవంతులుగనుండిన యధికారులనుఁబట్టి యేర్పడినదని కొందఱియభిప్రాయము. (1) త్రిచ్ఛు (2) పురు (3) అను (4) యదు (5) దూర్వసులనువారే బలవంతులుగనుండిన యధికారులు. సాయనాచార్యులవారు పైశబ్దములు బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర, నిషాదుల

కన్వయించుననని పలికిరి. నిరుక్తకారుఁడగు 'యాస్కు' తనకంటెను పూర్వముండిన పండితాభిప్రాయములను స్వీకరించి యాశబ్దములు గంధర్వులు, పితృలు, దేవులు అసురులు, రాక్షసులకు నన్వయించునని పలికిరి. ఈ జనులవిషయమున నేకాభిప్రాయము లేకయున్నది. పైన నాచేనుదుహరింబడిన యధికారులకు నన్వయించునని నే నూహించినాను.

పై యధికారులుండిన దేశముల నేర్పఱుప నిపుడు శాశ్వతములుగ నిలిచిన నదులవిషయముఁ దెలుపుట యవశ్యకము.

నదులవివరము.

ఋగ్వేదములోఁ బదియవమండలము 75 సూక్తములోఁగల నదీస్తుతి యీరీతిఁ బలుకుచున్నవి.

" జలదేవతలారా! యజమానుని యింటనుండు కవి మిమ్ము నుతించుచున్నాఁడు. మీ రొక్కరొకరు సప్తశాఖలయి మూఁడుప్రవాహములుగఁ బ్రవహించుచున్నవారు. అందులోను సింధూనది మిగుల గాంభీర్యముగలది "

" సింధూ! ధనధాన్య ప్రదేశముగల, దిశకు నీవు ప్రవహించునపుడు వరుణదేవుఁడు నీకుఁగాను మార్గమేర్పఱచెను. నదులకెల్ల నీవు రాజుగ రాజిల్లుచున్నావు "

" సింధూ! గోవులు పొదుగులోఁ బాలునించుకొని దూడలసరసకుఁ బోవురీతిని, మిగత నదులు జలమునించుకొని నిన్నుజుట్టుచున్నవి. రాజు సేనను గూడి యుద్ధమునకుఁ బోవురీతిని నుభయపార్శ్వములోను నదుల నిడుకొని పురోగామిగ నీవు నడచుచున్నావు "

సింధూనదీ! నీవు ప్రారంభమునఁ ద్రిష్టమతో సంగమించితివి. పిదప సుసార్తు రసా స్వాతి వీరితోఁగూడితివి. కూభా గోమలతో గలసిన క్రుమానుగూడి మహా తనూనదినిఁ జేరితివి. ఈ నదులనెల్లఁ గూడికొని యొకరథములో నీవు నడచుచున్నావు.

దేశచరిత్రల ప్రావీణ్యముగల పండితునకుఁగాని యీయొక సూక్తము నుండి యార్యుల వాసస్థానము లూహింపనుగాని వేదములో బలుకంబడిన నదుల నామము లిప్పటినదుల నామములతో సరిపోల్చుటగాని కష్టతమము. సింధూనది నామమును దాని యుపనదుల నామములును ననేకఋక్కులలో నుదహరింపఁబడినవి. సరస్వతీనది యతివిచిత్రముగ వర్ణింపఁబడినది.

## సరస్వతి యెద్ది?

"ఆహారవస్తువులు పుష్టికరముగ సమర్పుకొని జలధ్వనితో సరస్వతి వచ్చుచున్నది. ఇత్తడికోటవలె మమ్ముఁ గాపాడుచున్నది. రథముసెక్కి యుద్ధము నకుఁబోవు యోధునింబలె, నతివేగముగఁ బోవుచున్నది. మిగత నదులనెల్ల వెనుక వదలి ముందు నడచుచున్నది, యని యొక ఋషి వర్ణించినాఁడు. "నదీజలములలో నిర్మలమై పర్వతములనుండి సముద్రమునకుఁ బాఱుచున్నది. విశాలమగు ప్రపంచ మునకు సౌభాగ్యము లిచ్చుచున్నది. దానితీరములందుండు వారికిఁ బాలును నేనెయునిచ్చును.

ఈ సరస్వతియే "సింధూ" నదియని యాంగ్లేయులు గొందఱు తలఁచి నారు. ఏలయన; సింధూనది యన్నినదులలోను గొప్పది. పరిష్యాలోనుండు గొప్ప నదిపేరు హరక్వైతి. ( Helmond ) ఆ పేరు సరస్వతీ నామమేను. గొప్ప నదు లకు సరస్వతియనుట సహజమను కారణమును దెలుపుచున్నారు. వేదములోఁ గాని మఱియేగ్రంథమునందుఁగాని సింధూనది సరస్వతియని పిలువంబడలేదు. సరస్వతి ప్రత్యేకనది యనియు దానిచెల్లెలు దృషద్వతియనియు నుడువంబడినది. బహుశా యీనదు లొకానొక సమయమున గొప్పనదులుగనుండి సముద్రమునకుఁ బోవుచుండెను గాఁబోలు కాలాంతరములపైన సన్నగిల్లి రాజపుత్రస్థానపు టెడా రులలో నదృశ్యములైయుండును. జననస్థానమున నిప్పటికిని సరస్వతీ నామమున చిన్ననది యున్నదనియు నంత్యభాగమందది ఘూర్ఘారని పిలువఁబడుచున్న దనియు నుడివెదరు. పై రెండునదుల మధ్యప్రదేశమే "బ్రహ్మావర్త" మని పిలువఁబడు చున్నది. ఈ దేశమునకుఁ బశ్చిమదిశ నుండునదే "పంచనదీ" తీర భూమి, పంజాబు. సరస్వతీ దృషద్వతుల మధ్యనుండు బ్రాహ్మణులను జేరి ప్రపంచజను లెల్లరు ధర్మాధర్మ సూక్ష్మములు తెలియవలెనని మనుస్మృతి పలుకుచున్నది. పంచనదీతీర భూములుతెలియ ఋగ్వేద ఋక్కులలోనుండు నామములిపుడు దురవగాహములు కావున వానివివరములు దెలిపెద.

| ఇప్పటి యాంగ్లేయనామము. | ఋగ్వేదనామము. | గ్రీకువారినామము. |
|---|---|---|
| (1) జీలం | వితస్త | హైడాస్పెస్. |
| (2) చీనాబీ | అశిక్ని | అకిసినోస్. |
| (3) రావి | ఐరావతి లేక పురూష్ణి | హైడ్రోటిస్. |

| | | | |
|---|---|---|---|
| (4) | బియాస్ | విపాశ, లేక, ఆర్యీక్య | హైపాసిస్. |
| (5) | సట్లెజ్ | శతద్రు శతుద్రి | జుడాడ్రస్. |

పైనవివరించిన యైదునదులునుగూడి మరుద్వృధయను నామమున ప్రవహించుచుండెను. మరుద్వృధయన గాలిచే వృద్ధినందునదియని యర్థము. సుసార యనఁగ సింధూనది. పై నదీతీరములందుండిన జనులెవరయినది తెలిసినంతవరకు వివరించెద.

పంజాబు నదీ తీర వాసు ళ్ళ రాజులు.

(1) పురూష్ణి ( Ravi ) కి నుత్తరభాగమనఁగా నుత్తర పంజాబంతయు "పురు" యను నాయకునకుఁ జేరినభూములు. ఈ పురవంశమునకే భరతవంశము వారని పేరుసైతమున్నది.

(2) శతద్రు ( Sutlaj ) కు దక్షిణదిశకు నుత్తరముగ హిమాలయమువరకు "త్రిత్సు" భూములు. ఋగ్వేదమున (3. 33) ఋక్కులో పురూష్ణికినుత్తరమున "పురుదేశమనియు శతద్రుకుఁ బ్రాగ్దక్షిణభూములు త్రిత్సుభూములనియు తెలుపఁ బడినది. పురువంశమువారు భరతవంశమువారయి తుదకు "కురు" వంశమువారైరి "త్రిత్సు" వంశమువారు బహుశా పాంచాలురని తోఁచెడు. ఈవంశము పురాణ యుగమున నంత్యమైనది కాఁబోలు. యదుదూర్వసులు "త్రిత్సు" భూములకు దక్షిణ మునను ప్రాగ్దక్షిణములను యమునానదివరకు వ్యాపించియుండిరన్ని యూహ కలుగుచున్నది. యదువంశమువారే సూరసేనులని పేరంది మధుర ముఖ్యపట్టణ ముగఁ జేసికొనిరి. సింధూనదికిఁ బశ్చిమభాగమున "అను" వంశమువారి దేశము. పైనఁబలికిన అరియానాయనునదే వీరిదేశము. వీరు చెడినయార్యులని చరిత్రకారులు వ్రాసినారు. పైనవివరించిన పంచజనులుగాక మతవిషయమునను సాంఘిక విషయ ములలోను చెడినయార్యులు కొందఱుండిరి. గాంధారానువులకుఁ బశ్చిమభాగ భూములందు "పృథులు" "పార్శ్వన్"లుండిరి. ఋగ్వేదములో నుదహరింపఁబడిన "పురుత్రిత్సుల యుద్ధమున పృథుపార్శ్వులు త్రిత్సులపరముండిరి. పృథులనఁ బార్థి యన్లు. పార్శులనఁ బారశీకులు. సంపూర్ణోత్తర భాగదేశములం దుత్తరకురులు నుత్తర మదురాసులుండిరి. ఆర్యులదేశములను ఋట్టినవారు ద్రావిడులు సిథియన్లు అక్కేడియన్లు. వీరితో నార్యులపుడపుడు యుద్ధమొనర్చుచుండిరి.

ఆర్యుల గుణములు.

ఆర్యులత్యున్నత నాగరికతచేఁ బ్రసిద్ధికి నెక్కినవారుగనుండినను వారిగుణముల

లోను మతవిధులలోను హెచ్చుతగ్గులు గలుగుటకుఁ గారణములనేకములు తటస్థించెను. ఆర్యులు సహజముగ సాత్త్విక స్వభావముగలవారై యుండిరనుటకు సందియంబులేదు. మెత్తనివారయి పరులజోలికిఁబోవ నిష్టములేనివారుగ నుండినదినిజము. కృషికర్మమును పశువులపోషణమును ముఖ్యములగువృత్తులుగ నుండినవారనునది వాస్తవము. గృహమున సుఖవాసులై దైవాయత్తచిత్తులయి కాలముఁ గడపుచుండిరనునది యాదార్థ్యము. యుద్ధవృత్తివారికి నిషిద్ధము. మానవరక్తముకాదు, మృగరక్తముసైతము వారు కంటఁజూడ నిచ్ఛయించువారుకారు. అహింసావృత్తియు వారి ప్రథమధర్మము. ఈగుణములు ప్రాచీనార్యులవి.

## ట్యూరేనియన్ల బాధలు.

సుగుణసంపదచే వారింట సుఖముగనుండుకాలమున వారికి నిఱుఁగుఁబొఱుఁగు వారిబాధలు బలమాయెను. కష్టసమయములందొకానొకతఱి వారితో సంబంధ సంపర్కము లవశ్యకమయ్యెను. ఈసంబంధము యిరానులకు హెచ్చుగనుండెను. ఆర్యులకుఁ గ్వచిత్తుగనుండెను. కావుననే యితరతెగలవారి దుర్గుణములుకొన్ని యార్యులకుఁ బట్టుపడెను. ఇదిసహజమేను. దీనినే డార్విన్‌గారు సహజవస్తుగ్రహణవిధి ( Law of natural Selection ) అని పిలిచిరి. ఉత్తరముననున్న సిథియన్లు మాటిమాటికి నార్యులపైఁబడి ధనధాన్య పశువులను దొంగలింపసాగిరి. వీరాచారవిహీనులు. దైవస్తుతులులేనివారు. వీరినే యార్యులు పిశాచములనియు దొంగలనియు నిందించుచుండిరి. ఐరాన్లకుసైతము ట్యూరేనియన్లబాధలు బలమాయెను. " అహిష్మాన్ దేవ " యను దానవునిబాధకుఁ దాళఁజాలక దైవమా! ట్యూరేనియన్లు మాసత్వములను గొల్లఁగొట్టుచున్నవారు. ఋజుమార్గ ప్రవర్తనులయి పశువులఁ గాపాడుకొనుచును భూములు దున్నుకొనుచును, నుండువారిపై ద్వేషముఁ జెంచుచున్నవారు. వీరినుండి మముఁగాపాడుము " అని యిరాన్లు నుతించినారు. వీరికినించుక సమీపప్రదేశములలోనే "అక్కాడ్లుం"డిరి. వీరిప్పటికి హెచ్చునాగరికులుకారు. సంపూర్ణ క్రూరస్వభావులుగ నుండలేదు. అయినను వీరార్యుల నప్పుడప్పుడు బాధించుచుండిరి. వీరనేకములగు కోటలుగట్టుకొని పరులకు దుస్సాధ్యులైయుండిరి. ఈ యనార్యులకు నొకకాలమున శంబరుఁడను నాయకుఁడుండెను. ఆర్యుల నాయకుఁడగు దివోదాసు వీనితో యుద్ధములు సలుపుచుండెను. " ఇంద్రా! నీవొకదినంబున మాశత్రువులఁ దొంబదితొమ్మిదికోటలు పడఁగొట్టితివి" యని యొకఋషి పలికినాఁడు;

## ద్రావిడులోకదిక్కు.

ఇంక నార్యుల భూములకు దక్షిణమున ద్రావిడులుండిరని యొక పురాతన చరిత్రకారుఁడు వ్రాసినాఁడు. పూర్వమునఁ బాటలయను నొకపట్టణము సింధూనది దిగువభాగమున నుండెననియు నది రేవుగ నుండిన కారణంబున నిండియాలో నగు "మజ్లిక్" బట్టలా రేవునుండి యుత్తరదేశములకుఁ బోవుచుండెననియు నీ పట్టణవాసులు నాగజాతికిఁ జేరినవారనియు వీరి రాజ్యస్థాపకుఁడు వాసుకి యనియు వీరే ద్రావిడులనియు గ్రీకుచరిత్రములోనున్నదని రాగోజిన్ వ్రాసినది. ద్రావిడులకును ప్రాగుత్తర చైనావారికిని విశేషసంబంధ మున్నరీతిగ శబ్దతత్త్వజ్ఞులు ( Philologists )ను మానసగుణ విచారతత్త్వజ్ఞులు (Psychologists)ను తెలుపుచున్నవారు. అక్కాడ్లకును ద్రావిడులకును చైనావారికినిఁ గేవలసంబంధములున్నవనియును వీరందఱు నాగులను బూజించువారనియు చరిత్రకారులు వ్రాసినారు. ద్రావిడులును అక్కాడ్లును ట్యురేనియన్లనుండి చెడుగుణము లనేకములు నేర్చిరి.

## ట్యురేనియన్లు.

ట్యురేనియన్లు ప్రతివస్తువులోను నెద్దియో యొక భూతమున్నదని నమ్మియుండిరి. వా రైంద్రజాల విద్యలోను క్షుద్రవిద్యలోనుఁ బ్రావీణ్యముఁగలిగి యితరులను భ్రమపెట్టుచుండిరి. ఇట్టివారు "షామన్సు" అని పిలువఁబడుచుండిరి. వీరు దయ్యములు భూతములున్నవని నమ్మువారు. వానిని వదలింప మంత్రము లుచ్చరించువారు. తాళ్లు, అప్పలు, చెల్లు, చేమలు, భూతప్రేత పిశాచముల యాహ్వానోచ్చాటన తంత్రములు క్షుద్రదేవతల సేవలు పశువధలు మానవబలులు నీ జాతివారినుండియే ప్రపంచంబున వ్యాపించినది. సామీప్య సంబంధమున నీ గుణములుకొన్ని యార్యులకుసైతము పూర్వకాలంబుననే పట్టువడెను. ఈ చెడుమతములనుబట్టి బ్రాహ్మణములలోని యాగమకర్మములు బలమయినపుడు సహింపఁజాలక జరదష్ట్రఋషి (Zoraster) యైరాన్లకు నొకమత మేర్పఱచెను.

## ఆక్కాడ్లు,

మనపురాణములలోని యనేకగాథలు పాతాళము, నరకము, యమదూతలు, పితృవాసములు ప్రళయవార్తలు మొదలగునవి యాకాడ్డుల మతమునకుఁ జేరినవి. ఆర్యులు మధ్య యేష్యాలోనుఁ గాశ్మీరములోను నుండునపుడే వారికి పై మతములు గొన్ని పట్టువడెనని నే నెంచెద. కాశ్మీర మార్యులువదలి పంజాబుచేరుకాలమున వారికి దస్యులబాధలు బలమాయెను. ఋగ్వేదమునం దీజనులను గేవల పిశాచ

ములుగ వర్ణించినారు. అంతటిబలెనే వారుసు మానవులు నాగరికత లేనివారు క్రూరస్వభావులు. ఆటవికులు. వీరిపేరు ఋగ్వేదములోఁ బలుమారు వచ్చుచున్నది. దస్యులన జనులని యర్థము.

## ద స్యు లు.

రాక్షసులునుగారు పిశాచములునుగారు. ఏరానుల జన్దవస్థలో వీరిని "దహ్యు" లని పిలిచిరి. అఖెమీనియన్ల శాసనములో సైతము వీరికి దహ్యులని పేరున్నది. వీ రార్యులను ప్రారంభమున బాధించుచుండిరి కావున "దస్యు" శబ్దార్థము శత్రువులకుఁ బేరయ్యెను.

## దస్యునామమున కర్థభేదములు.

వీరి నార్యులు జయించినపిదప నార్యుల దాసులైరి. అపుడు "దస్యు" శబ్దము సేవకులను నర్థమున నుపయోగింపఁబడెను. దస్యులబాధ బలముగనుండి నపుడు వారిని నార్యులీరీతిగ శపించుచుండిరి.

"ఇంద్రా! చెడ్డదృష్టికలిగి పచ్చిమాంసము భక్షించు దుర్మార్గులగు వీరిపై నీ యసహ్యామంతయును జూపుము. ఈ దుష్టుల నగాధకూపంబులఁద్రోసి యంధకారమునఁ గప్పుము. ఆర్యుల దైవస్తవములను వీరు వినఁజాలరు. అట్టి దుర్మార్గుఁడొకఁడైనను వెలికిరానటుల నొత్తి కోపమునఁ బట్టియుంచులాగున నీకు బలమురానిమ్ము" అని యొకఋషి శపించెను.

## ఆర్యావర్తమునకు నిండియాయనియు హిందూస్థానమనియుఁ బేరేలకలిగెను?

ప్రారంభమునుండియు నార్యులెచటనెచట నుండిరో యా స్థళములకు నార్యావర్తమని పేరు గలిగియుండెను. ఇట్టి యార్యులకు హిందువులనియు వారి స్థానము హిందూస్థానమనియు నిండియాయనియు నామము వచ్చినందులకుఁ గారణంబేమనిన:—ఆర్యులు పంజాబుచేరినపిదప నైరానులు నా స్థళమును "హేప్తా హిండాజ్" యనియు యార్యులను "హేప్తాహైందవ" లనియు పిలుచుచుండిరి. ఋగ్వేదములో సప్తసింధవా యనియున్నది. హీబ్రూల మతగ్రంథమగు "వమాస్" అను గ్రంథములో నార్యుల దేశము "హన్దు" అని పిలిచినారు. ఇది సింధు శబ్దమునుండి పుట్టినదియ. ఈ "హన్దు" ను గ్రీకువారు "ఇండియోస్" అనుచుండిరి. దీనినుండియే యిండియాశబ్దము పుట్టినది. "సింధు" శబ్దము "శాన్ధ్" యను ధాతువునుండి పుట్టినదనియును దానికి శక్తియని యర్థమనియు కొందఱభి

ప్రాయపడినారు. ఇండియా యొక్క శక్తియుఁ గీర్తియునుఁ జూచి జ్యాజాంతివారు దానిని హిందని పిలుచుచుండిరని గ్రీకుపండితుఁడు థెటిసోక్లీసు వ్రాఁసినాడు. హీబ్రూభాషలో "హిందు" అనఁగా శక్తియని యర్థము. కావున నార్యులను హిందువులని పిలుచుట పురాతన నామముగాని నూతనముగాదు హిందువులన శక్తికలవారని యర్థము.

అతిపురాతనార్యులు, ఋజుమార్గప్రవర్తకులు సత్య మెప్పుడును మానరు నీతివదలరు. భూతదయ పశ్చాత్తాపములుగలవారు. పెద్దలవిషయమున వినయ విధేయతలు చూపువారు. విద్యాశక్తి హెచ్చుగనుండినది. ఒకకుటుంబ మొక చిన్న రాజ్యముగనుండెను.

ఆర్యుల గృహకార్యములు.

తండ్రి యా గృహరాజ్యమునకుఁ బెద్ద. మిగతవారందఱు అతని యాజ్ఞా ధారకులు. తల్లి గృహకృత్యములు నెఱవేర్చునది. అక్కచెల్లెండ్రు పిల్లలనూఁ ఆడించి రక్షించువారు. తమ్ములును గొడుకులును సేవ్యమొనర్చువారు. బిడ్డలు పశువుల నింట రక్షించుచుఁ బాలుపిండి పాడిచేయువారు. అల్లుండ్రును బెద్దకుమారులును శిష్యులును గోవులను మేపుటకుఁ గొనిపోవుచు వ్యవసాయంపుఁ బనులు నెఱ వేర్చుచుఁ దీరినపుడు యజమానునివద్దఁ జదువుచు నింట సుఖముగ నుండుచుండిరి. పరులు తమ్ము బాధించునప్పుడు తప్ప నితరకాలములందితరుల జోలికిఁ బోవు వారుకారు. బాధించిరేని నాత్మరక్షణార్థము పోరొనర్చుచుండిరి. దానికిఁదగిన సాధనసంపద నార్జింప ధనుర్విద్య నేర్చిరి. పాలుగువారిపోరు బలమయిన ట్లెల్ల యుద్ధసాధనము లార్జించిరి.

బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులనుటకు గారణములు.

గుఱ్ఱపు రౌతులైరి. వివిధాయుధ పాణులైరి. విమానయాన విద్య నైతము నేర్చిరి. దేశములో జనసంఖ్య హెచ్చయినట్లెల్లఁ గ్రొత్తగ భూములాక్ర మింపసాగిరి. ఇటు నవీనముగ భూములాక్రమించు తఱినిఁ గలిగిన యుద్ధములలో నతిసాహస పరాక్రమముల విజృంభించి తన జనులను రక్షించిన ధీరుఁడా దేశ మునకుఁ బెద్దయయి గౌరవమందుచుండెను. ఆరీతిగ నట్టి పరాక్రమశాలి రాజిల్లి గౌరవనీయుఁడైనందున వానికి "రాజ"ని బిరుదు నామము వచ్చెను. ఇండ్లయందు నిలిచి యుద్ధమునకుఁబోయినవారి క్షేమ చింతనసేయుచుఁ దమకుఁదోఁచిన దైవ మును స్తుతించుచు మంత్రములు జపించుచు నుండిన ముసలివారు బ్రాహ్మణులనఁ

బడిరి. బ్రాహ్మణములన మంత్రములు. పారొనర్చుటకు శక్తిలేకయు, మంత్రములు కల్పించి దైవస్తుతులొనర్పు ప్రావీణ్యము లేకయునున్న జనులు "విశు" లనంబడిరి. అనఁగా నింటనుండువారని యర్థము. ఈరీతిగ నింటనుండువారు సోమరిపోతులుగాక యనేకకళల నభ్యసించుచు నా విద్యలయందుఁ బ్రావీణ్యముఁగని తమ్ముఁగాపాడు సత్త్వశాలురగు రాజన్యులకును వారినిఁ గాపాడు బ్రాహ్మణులకును సాహాయ్యపడుచుండిరి. బ్రాహ్మణులన మంత్రములుచ్ఛరించువారని యర్థముగాని మఱియే విశేషార్థ మందునలేదు. ఈ మంత్రములు కల్పించువారు కొన్నియిండ్లవారయి వారదేశమునకుఁగాను విద్యాప్రావీణ్యమందిరి. తమ సంతతివారికి నా విద్య నభ్యసింపఁజేయుచుండిరి. ఈరీతిగఁ గొన్నియిండ్లవారు మాత్రము మంత్రవిద్య నభ్యసించువారైరి. మిగతవారా విద్య నభ్యసింపఁగూడదను నిషేధవిధి యప్పటికి నుండలేదు. క్షత్రియులన బలముఁగలవారని యర్థము. శాత్రవబాధ బలమయిన ప్రారంభసమయమున గొందఱార్యులు బలమార్జించు సాధనము లభ్యసింపసాగిరి. ఆవిద్యయ వారికి నలవాటయినందున వారిసంతతికిసైత మదేవిద్యఁ గఱపుచుండిరి. మంత్రములుచ్చరించు బ్రాహ్మణులుసైతము గొన్నిసమయములందు యుద్ధవిద్యాప్రావీణ్యమార్జింపఁ బ్రయత్నించి యోధులైరి. ఈరీతిగ మంత్రార్జనవిద్యయు బలార్జనవిద్యయు వివిధ కళాకౌశలమును నార్జించుచుండినను నార్యులెల్లరును కృషికర్మము ముఖ్యముగఁ జూచుచుండిరి. ప్రాచీనార్యులు ( Premitive Aryans ) కొంతకాలమువరకుఁ దమబుద్ధిని నితరవృత్తులందు వినియోగింపకయుండిరి. అపుడార్యులందఱు సమాన స్వాతంత్ర్యముగలిగి యేచింతయును లేక సుఖముననుండిరి. పిదప దస్యులబాధకు నోర్వక యుద్ధములొనర్చి దేశములుసాధించి పరదేశముల భాగ్యములఁ గొల్లఁగొట్టి శ్రీమంతులరీతిగ రాజఠీవు లనుభవింపసాగిరి. దైవశక్తియందు సంపూర్ణ విశ్వాసముగలవారప్పటియార్యులు కావున దైవములనుగుఱించి బ్రాహ్మణములు రచించి పఠించువారిస్తుతులు దైవమువిని తమకు యుద్ధములందు సాహాయ్యుఁడై జయమార్జింపఁజేసెనని యెన్ని బ్రాహ్మణములను రచించువారే దైవములని నమ్మిరి.

## బ్రాహ్మణులు దైవములు.

బలముగలిగి యుద్ధములుసేయు రాజన్యులందు దైవ మావేశించి వారిమూలకమునఁ దమ్మురక్షించినాఁడని నమ్మి క్షత్రియరాజులను రెండవ దైవముగ విశ్వసించిరి. పై రెండుతరగతులవారు గాక మిగతవారు విశులైరి. ఈరీతిగఁ గొని

శతవత్సరంబులు గడచినపిదప దినదిన ప్రవృద్ధినందు జనులబుద్ధి కౌశలముచేఁ బైమూఁడు తరగతులు మూఁడు కులములువారుగ విభజింపఁబడి కాలాంతరములపై హిందూదేవతలరీతి ముప్పదిమూఁడు కులములయి యెఱుపునీకునులేక యీకులవృక్షమసంఖ్యాకములగు శాఖోపశాఖలతో హిందూదేశమును గప్పెను. ఆర్యుల యైకమత్యమునుఁ జెడిచెను. జనులసంపూర్ణ స్వాతంత్ర్యము తగ్గెను. భాగ్యవంతుఁడు పేదవాఁడనుబుద్ధి జనులందంకురించెను. గొప్పవారి పూజలు ( Hero-worship ) ప్రారంభమాయెను. బ్రాహ్మణులు నిజముగ దైవములైరి. రాజులు దేవాంశగలవారైరి.

ప్రాచీనార్యులు మాంసభక్షకులా? కాక, కేవల సాత్వికాహారములను గొనిమునినవారా? సాత్వికులైనచో నీ రాజస తామసాహారములు గొనుపద్ధతి యెపుడువచ్చెను? ఈ విషయ మించుక చర్చింపఁదగినదిగ నున్నది.

### ఆర్యులు మాంసభక్షకులా?

ఆర్యులు ప్రారంభమునుండియు మాంసభక్షకులని పాశ్చాత్యులనేకులు తాత్పర్యపడినారు. ఆర్యులు కేవల సాత్త్విక గుణప్రాధాన్యులు కావున రాజసతామసగుణానువర్తుల సంబంధము చేరునంతవరకు వారు మాంసభక్షకులు కారనియు నాసంబంధదోషము సంభవించినపిదపసైతము మాంసాహారము గొనునంతటి విపత్తుసమయము దటస్థించువరకు నట్టిపద్ధతికిఁ బోయియుండరనియునుఁ దోఁచెడు. ఆర్యులప్పటికి భక్షింపవలయునవిన ఫలములు కందమూలాదులు సకలధాన్య విశేషములు పుష్కలముగనుండెను. వానితోఁ దృప్తిఁబొందియుండిరి. ప్రేమ క్రౌర్యమునుసైతము జయించుననురీతినిఁ గ్రూరమృగములుసైతము వారి లాలనలకు లోఁబడియుండెను. కావున పశుపక్షిమృగాదులు వారిప్రేమాస్పద జంతువులయ్యెను గాని యాహారాధారవస్తువులు గావయ్యెను. అనేకవిధములగు పిండివంటలమర్చి దేవతానివేదనలొనర్చి తాము భుజించుచుండిరి. పక్తి పురోడాశము అపూపములు కారంభములు ఈ మొదలగు పిండివంటలుండినటుల ఋగ్వేదఋక్కులలోఁ దెలుపఁబడినది. బియ్యము గోధుమలు నీరుజొన్న లుండినటులఁ గొన్నిఋక్కు లున్నవి. పాలుండెనని చెప్పనేల గోధనమే వారివిభవము. పెరుగు వెన్న మీగడ తేనె యీవస్తువులు వారికి విశేషముగనుండెను. ఆర్యులనెల్లకాల మెదురించుచుఁ బోరుచుండినవారు ట్యూరేనియన్లు. దస్యులు మొదలగువారు గృహక్షేత్రములులేక మేఁకలతో నడవులలో సంచరించుచుండినవారు. వారికి మాంసమే యాహారముగనుండెను. పంజాబుచేరినతటి నార్యులకు దస్యులతోఁ బోరుబలమాయెను. దస్యులేమి

సామాన్యులుకారు. ఆర్యులకు సులభముగ స్వాధీనులైనవారుకారు. ఆర్యయోధులు వారిని వెంబడించి దూరదేశములకువెళ్లి యేండ్లకొలఁదిని దస్యులతో యుద్ధమొనర్చుట యవశ్యకమయ్యెను. దస్యులుండినది కొండలప్రదేశము. వారు భూములుదున్ని పంటలు పండించువారుకారు. ఆర్యయోధు లాహారవస్తువులుగొని కొండలగుండ ప్రయాణము సేయునంతటి సాధనసంపద లుండినవారుకారు. కావుననే యుద్ధ కాలమున నుదరపోషణార్థ మడవినుండి పశుపక్షి మృగాదులనుజంపుట యవశ్యకమగు కర్మమయ్యెను. కొన్నిదినములకిది యలవాటయ్యెను. ఈరీతి యుద్ధములకుఁ బోయి శత్రువులనుజయించి దేశములు సాధించిన యోధులే క్షాత్రముగలవారు కావుననే వారికి క్షత్రియులని నామమువచ్చెను. ఇందునఁ గొందఱు రాజన్యులైరి. కాలక్రమమున బ్రాహ్మణములు వఠించు బ్రాహ్మణులు "బలాచపృథ్వీ" యను లోకోక్తిరీతిగ రాజన్యుల ననుసరింపవలసినది యవశ్యకమయ్యెను. "యథా రాజా తథా ప్రజా" యను నుడి ననుసరించి ప్రజలు రాజులమార్గ మవలంబించిరి. అయినను జనులకది నూతనపథమయ్యెను కావున వారించుక సందియింపఁ దత్సందేహ నివారణార్థమునకై యాహారములగు పశుపక్షిమృగాదులను దేవబలులుగ నివేదించి పిదప భక్షింపసాగిరి. కొన్నిదినముల కీమాంసభక్షణము ముఖ్యమగు మర్యాదగ నేర్పడెను. గౌరవనీయులగు మహనీయు లింటికి నతిథులుగ వచ్చినపుడు, గృహస్థు తాను ప్రీతిగఁబెంచిన యావును దేవబలిగనిచ్చి దానిమాంస మా యతిథికి భోజనమిడుచుండిరి కావుననే "యథితికి" "గోఘ్నుఁ" డని పేరువచ్చెను. ఈ పద్ధతినుండి పుట్టినవియే గోమేధ అజామేధ అశ్వమేధములు. వేదయుగముననే యీమేధములు సులభమగు దేవబలులుగనేర్పడి బ్రాహ్మణముల కాలమున ననేకకష్టతమములగు కర్మానుష్ఠానము లను వలలలోఁ జిక్కువడి తదనుష్ఠానపరుల ధనములాగుటకు స్వర్గసుఖమను గాలామిషమును దవిలించి జనుల ననేక మూఢవిధులలో ముంచెను. దేవబలుల నిచ్చుటకు నర్హమగు పశువులు మేఁకలు గొఱ్ఱెలు ఆవులు ఎద్దులు దున్నపోతులు జింకలు. జయమార్జించి యోధులు పురిఁజేరినపిదపఁ బట్టణ సంతర్పణసమయమున ననేకములగు పశుమారణ కర్మములు జరుగుచువచ్చెను. ఆవును దైవమని పూజించు నార్యు లెప్పుడేగాని యావునుఁజంపి భక్షించుచుండిరను విషయ మిప్పటి హిందువులు నమ్మరు. ఋగ్వేదమునందు సైతము గోవు దైవముగఁ బూజింపఁబడినది. బలిగఁబెట్టి హింసించినరీతిగ నగపడదు. M. 6. 16. 47 లో గోవుల పేరున్నదిగాని యది గోమేధమునుగుఱించి పలికినరీతిగ నగపడదు.

అథర్వవేదములో నేడవకాండ 5-వ సూక్తములోఁ బశువులను బలులుగ దేవతలు పూర్వయుగములోనిచ్చుచుండు విధులుగలవనియు నటులారాధించువారు పురాతన దైవములయిన సాధ్యులను జేరుదురనియు నొకానొక సమయమున దేవతలు ఋక్కను బలిగనిచ్చిరనియు కొన్ని యాగములలో గోవుల యవయవములు బలి యిచ్చిరనియు చెప్పఁబడియున్నది. అదే వేదమునఁబండ్రెండవ కాండలో నాల్గవ సూక్తము 38-వ ఋక్కులో "ఎవఁడయినను గాని యావు ఫలకారికాదని తలఁచునో, వాఁడు దానిమాంసమును వండువాఁడగు" నని నింద్యింపఁబడినది. గొడ్డుపడిన యావును గాని, కందువేసికొనెడి గోవునుగాని వండనగునని యర్థముచేసినారు. 53-వ ఋక్కులో "బలిగ నారాధించిగాని యారాధింపకగాని యెవఁడావును తనయింట వండునో, వాఁడు దూషింపఁబడుచుఁ, బ్రపంచము వదలిపోవునని వ్రాయఁబడినది. ఇవియన్నియునుఁజూడ వేదయుగములో గోబలియుండినట్లు నాకగపడదు. తైత్తరీయ బ్రాహ్మణములో "లావుగల యావుకాళ్లు" ఇంద్రునకు నివేదింపవలెను. గొడ్డు పడినయావును విష్ణువరుణులకు సమర్పింపవలెను. నల్లనియావు పూషునకు బలి యివ్వవలెను. ఒకదూడనీని మరల నీనని యావును వాయువుకు నివ్వవలెను. రెండు వర్ణములుగల యావును మిత్రావరుణులకు నివేదింపవలెను. ఎఱ్ఱని యావును రుద్రునకు సమర్పింపవలెను. గొడ్డుపడిన తెల్లని యావును సూర్యునకు నర్పింపవలెను" అని తెలుపఁబడినది. పంచశారదీయమను సవనములోఁ బదునేడు చిన్నయావులను బలియిచ్చు విధియున్నది. గొప్పతనము రావలయునని గోరువారీ సవనమొనర్ప వలయునని తైత్తరీయ బ్రాహ్మణములోనే పలుకంబడినది. గోమాంస సేవనమును నది యెప్పుడో వేదయుగమున నొకానొక కాలమునందుండి వదలంబడి మరల బ్రాహ్మణముల కాలములో హెచ్చయి రెండవతూరి సైతము వదలంబడినరీతిగ నగపడెడు. మాంసనిషేవణము దూష్యమని యనేకు లభిప్రాయపడి దానిని మానిరి. శతపథ బ్రాహ్మణములో నావుమాంసమునుగాని యెద్దుమాంసమును గాని యెవఁడును దినవలదు. ఈ భూమినుండు సర్వభూతములును గోవృషభములు పెంచుచున్నవి. అవి సర్వభూతములనుఁ బోషించునవి కావున సర్వభూత శక్తియు దానికి దారబోయుదము, ఇతరపశువుల శక్తి వానిలోనిడుదము. తత్కారణముననే గోవృషభముల యాహారము హెచ్చెను. ఎవఁడు గోవృషభముల మాంసముదినునో వాఁడన్నిటిని దినినవాఁడగును. అట్టివాఁడు పునర్జన్మమున విపరీతభూతముగఁ బుట్టును. వాఁడు పాపాత్ముండగును కావున గోవృషభముల మాంసనిషేవణము నింద్యము" ఇటుల నింద్యమని దూషింపఁబడినను లేఁతపయ

సుననుండు గో వృషభ మాంసమైనచో నే భక్షించెదనని యాజ్ఞవల్క్య పల్కెనట. ఇటు మాంసభక్షణ మాచారముగ బ్రాహ్మణముల కాలములోఁ గొంతవరకు నుండి నను నార్యులు పశువులను దేవబలులుగ సమర్పించుచుండిరికాని భక్షించుచుండ లేదని కొందఱియభిప్రాయము. ఇదితప్పు. తైత్తరీయ బ్రాహ్మణములో నీరీతిఁ బలుకఁబడినది.

“లోభాగము చెడనటుల దానిచర్మము వలువుము. పిదప దాని యెదఁ జీల్చి ఱెక్కలు విప్పికొనిన పక్షిరీతి నుండనిమ్ము. పిదప ముందరి కాళ్లను వేఱు చేయుము. బండియాకులంబలెఁ జీల్చుము. ఇఱువైయాఱు ప్రక్కయెముకలు వేర్వే ఱుగఁ జేయుము. పశుమలినమెల్లఁ బల్లముఁద్రవ్వి దానిలోఁ ద్రోయుము. భూమినిఁగాఱిన రక్తము రాక్షసులకు వదలుము. అద్రిగూ! కటికా! నీపని నీవు చేయుము. విధులనుసరింపుము” గోపాద బ్రాహ్మణములో వధింపఁబడిన పశువు యొక్క యవయవము లెవరెవరు తీసికొనవలసిన విధు లేర్పఱుపఁబడినవి.

పైరీతిగ బ్రాహ్మణ కాలాంత్యమువరకు మాంసభక్షణవిషయము చర్చలో నుండినది. కొందఱు భూషించిరి కొందఱు దూషించిరి. ఆత్మయొక్క పునర్జన్మము సిద్ధాంతరీకరించినవెనుక నిది యించుక తగ్గనారంభించెను. పిదపఁ గొన్ని పశువులు దైవముగఁ బూజించుపద్ధతి ప్రారంభమాయెను. కావున గొన్ని పశుహింసలు నిలిచెను. పిదప బౌద్ధమతము వ్యాపించెను. పశుహింస వారియందు బొత్తిగ నిలిచి పోయెను. అచటనచట నిలిచియుండిన పద్ధతిని వైష్ణవమత వ్యాపనమణఁచెను. నిజమగు బలిపశువు పిష్టపశువయ్యెను. మనుస్మృతి పుట్టుకాలముననే మాంస భక్షణము నింద్యమైయుండెను.

మ. 5. (46) “ప్రాణకోటికి నొప్పిగాని, వానినిఁ జెఱనుంచుటగాని ప్రాణహింస గాని యొనర్ప నిచ్ఛయింపనివారు సుఖవిశేషమునందుదురు.

(53) శతాశ్వమేధములనుండి కలుగునంతటి పుణ్యము మాంసభక్షణము వదలుటచేఁ గలుగును.

ఆర్యులు పంజాబుచేరకముందు మాంసభక్షణ మెఱుంగరు. పంజాబు చేరిన కొంతకాలములోనే యది యలవాటాయెను, పశుబలులబుక్కులు నూతనములని నే నూహించెద. ప్రాచీనార్యులకుఁ బాకశాస్త్రము చక్కఁగవచ్చియుండె ననియును, వారికి నుడికించువిధమును వేగించువిధమును జక్కఁగఁ దెలిసి యుండెననియును, పచ్చిమాంసమును దినువారినిఁ గ్రవ్యాదులనియు అమాడ్లనియు నిందించుచుండిరనియును మాక్సముల్లరుగారు వ్రాసినారు. గోవులను

జంపునట్టియెడ్లు ( Slaughter house or కమేల ) యుండెనని రమేశచందర్ దత్తుగారు వ్రాయుచు M. 89. 14. ఋక్కును చూపినారు. ఆ ఋక్కులోఁ గమేలా సంగతి వ్రాయఁబడినదిగాని గోవులఁ జంపినటు లందు లేదు.

## ఆర్యులకు సముద్రయానముండెనా?

ఆర్యులకు సముద్రయాన ముండెనాయను విషయ మీ యుపన్యాసంబునఁ జర్చించి మిగతవిషయములనెల్ల మఱియొక యుపన్యాసంబునకు నుంచెద. హిందువులకు సముద్రయాన మెప్పుడు నుండలేదనువారు హిందూమతగ్రంథములగు వేద పురాణేతిహాసములు చదివినవారు కారనుటకు నే సందియమును లేదు. శ్రుతిస్మృతులేమి. పురాణేతిహాసములేమి నౌకాయాత్ర నిషేధవిధిని విధింపవు. సముద్రయాన మొనర్చినటుల ఋగ్వేదమునం దనేక ఋక్కులున్నవి.

మం. 1. 116. 3, 1. 136. 3. 5 — ఈ ఋక్కులలో "ఋజు" యను రాజు సముద్రయానము సేయునపుడు, నావమునుఁగ నశ్వినీదేవతలు వానినిఁ దీరముఁ జేర్చినటుల నున్నది.

1. 25. 7. వరుణునకు విహగముల గమనమార్గములును సముద్రములో సంచరించు మార్గములు తెలిసినటులున్నది.

4, 55, 6. ద్రవ్యాపేక్షకులు సముద్రయానము సేయుకాలమున సముద్రుని స్తుతించునటులున్నది.

7. 88. 3. " వరుణుఁడును నేనును సముద్రముపైన నౌకాయాత్ర సలుపునపుడు నేను నావలో సుఖముగనుంటిని. నావ, నీటిపైనల్లాడుచు నుయ్యేల యూఁచినటులఁ బోవుచుండెనని బ్రహర్షియగు వశిష్ఠుఁడు పలుకుచున్నాఁడు.

ఈ క్రిందవివరించిన ఋగ్వేద ఋక్కులన్నియును సముద్రయాన ముండినటుల రూఢిగఁ బలుకుచున్నవి.

| | | | |
|---|---|---|---|
| M. 1. 25. 7 | M. 4. 55. 6 | M. 8. 18. 17 | 10. 44. 6 |
| 1. 48. 3 | M. 5. 25. 9 | 64. 9 | 63. 10 |
| 56. 2 | 45. 10 | 72. 3 | 101. 2 |
| 97. 7 | 54. 4 | 42 3 | 105. 9 |
| 131. 2 | 59. 2 | 9. 73. 1 | 180. 2 |
| 140. 12 | 6. 58. 3 | 89. 2 | |
| | 7. 88. 3 | | |

# ప్రకటన.

బళ్లారిలో వకీలుగానుండి కీ శే. కోలాచలం శ్రీనివాసరావుగారిచే రచియింపబడిన యీ క్రింద వివరించిన నాటకములన్నియును విక్రయమునకు సిద్ధముగనున్నయవి.

## నాటకముల వివరము.

1. రామరాజు చరిత్రము
2. సుల్తానాచాందుబీ
3. శిలాదిత్య
4. ప్రతాపాగ్బ్రీయము
5. మైసూరురాజ్యము
6. చంద్రగిర్యభ్యుదయము
7. సుఖమంజరీపరిణయము
8. సునందనీపరిణయము
9. యువతీవివాహము
10. సీమంతినీ పరిణయము
11. మదాలసానాటకము
12. రుక్మాంగదనాటకము
13. సత్యహరిశ్చంద్రీయము
14. గిరిజాకల్యాణము
15. కాళిదాసనాటకము
16. మానవపిశాచనాటకము
17. మానాపమానము
18 చంద్రహాసనాటకము
19. ప్రహ్లాదచరిత్రము
20. ద్రౌపదీమానసంరక్షణము
21. కీచకవధ
22. శిరోమణినాటకము
23. బభ్రువాహననాటకము
24. శ్రీరామజననము
25. సీతాకల్యాణము
26. పాదుకాపట్టాభిషేకము
27. లంకాదహనము
28. కుశలవనాటకము

## ప్రహసనములు.

1. ఆచారమ్మకథ (కన్నడభాషలో) 2. అన్యాయధన్యపురిమహిమ 3. నాచిపార్టి

ఆంధ్రీకృతాగస్త్యభారతము (పద్యకావ్యము) సభాపర్వమువరకు

Dramatic History of the world ( in English )

వలయువారు ఈ క్రింది చిరునామాకు వ్రాయవలయు.

కె. శత్రుఘ్నరావు,